శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయనమః.

# ప్రహ్లాదునిహరికథ.

ఇది

పండితులచే పరిష్కరింపబడి

నాతా నమ్మయ్యశెట్టి అండుసన్ వారి




ముద్రింపించి

ప్రచురింపబడియె.

దీని వెల అణా ౧

౧౯౦౩

కీర్తన- రాగము- కాపి - ఆదితాళము
ఏమనేజుంకేళీవనమే యనుమెట్టు.

వినవమ్మాయీజ్ఞానము- విష్ణుప్రతాపము- వివరముచెప్పెదను॥ వి॥
దీనదయాళుడు- దివ్యగుణస్తుడు- దేవాదిదేవుడమ్మా-వాని
దినమునుగోరిన పాపముదొలగును దివ్యముక్తిగలదమ్మా వి॥
భక్తులగాచేటి బిరుదధరించిన పన్నగశయనుడమ్మా-మంచి
ముక్తిమార్గముచూపిముందుగాగాతుడు మురహరివాడమ్మా॥ వి॥
ఆశపాశలనుగోసి ఆపదలనుద్రెంచి ఆదరించేదేవుడమ్మా.వాని
ఆసతోగోరితె మోసముశేయడుఅభయమిత్తుడమ్మా॥ వి॥
ధరలోశ్రీరాముల దాసునిబ్రోచినసశావతారుడమ్మా.వాని
నిరతమునమ్మితే- కొరతలేదిక నిత్యానందుడమ్మా వి॥

వ॥ నారదమునీశ్వరులు యీలాగుచెప్పగానే లీలావతివినిఅయ్యామునీశ్వరులారా హరిస్తోత్రము చేయుటవలన వచ్చుభాగ్య మేమో యవినాంగీకరింపుము యనియడుగగా నారదులుచెప్ప నారంభించినారు-

శ్లో॥ వాసుదేవం పరిత్యజ్యయోన్యదైవముపాసతే
తృషితో జాహ్నవితీరేకూపం ఖనతిదుర్మతిః॥

వ॥ యెట్లనగా నారాయణుని సేవించక యితరదేవతలను ధ్యానించువాడు యెట్టివాడనగా దాహమువలన దప్పిదగిలినవాడు గంగగట్టున నూయిత్రవ్వినీళ్ళకుఅల్లాడిన వానిరీతిగదాయని యెరుగవలెను ఆనారాయణుని ధ్యానించినయెడల గలుగుఫలము యేమనగా-

శ్లో॥ జన్మాంతర సహస్రేషు తపోధ్యాన సమాధిభిః
నరాయణాంక్షీణ పాపానాం రామభక్తిప్రజాయతే॥

వ॥ తల్లిలీలావతి యీమానవజన్మంబులో భగవద్ధ్యానసమాధియనువటకర్మములుచేసి యున్నవారికి ఆనారాయణునిమీదు భక్తిగలుగును అట్లు భక్తిచేసినవాడె సత్పురుషుడని యెరుగవలెను శ్రీమన్నారాయణాయ నమః॥ యని ధ్యానించినయెడల సకల పాపములు దొలగిసుఖమునొందుదురు యని చెప్పగానెలీలావతిగర్భమందున్నబాలుడు ఊహించివినుచుండెను

దోరా. ౬

అట్టిసమయంబున హిరణ్యకశిపుడు అద్భుతతపముదచేయగన్లుం
యెట్టిదేవతలు భయమునొందిరి- యింపైనఐశ్వర్యము పొందగన

కీర్తన- రాగము- కాపి - ఆదితాళము

ఏమి వేణుం కేళీ మనమె యను మెట్టు.

వినవమ్మా యీ జ్ఞానము- విష్ణుప్రతాపము- విశదము చెప్పెదను॥ వి॥

దీనదయాళుడు- దివ్యగుణస్తుడు- దేవాదిదేవుడమ్మా-వాని

దినమును గోరిన పాపము దొలగును దివ్యముక్తిగలదమ్మా వి॥

భక్తులగాచేటి బిరుదవహించిన పన్నగశయనుడమ్మా- మంచి

ముక్తిమార్గము చూపి ముందుగా గాతుడు మురహరివాడమ్మా॥ వి॥

ఆశపాశలను గోసి ఆపదలను దీర్చి ఆదరించే దేవుడమ్మా వాని

ఆనతో గోరితె మోసము జేయడు అభయమిత్తుడమ్మా॥ వి॥

ధరలో శ్రీరాముల దాసుని బ్రోచిన సద్భావతారుడమ్మా, వాని

నిరతము సన్నుతె- కొరతలేదిక నిత్యానందుడమ్మా వి॥

వ॥ నారదమునీశ్వరులు యీలాగు చెప్పగానే లీలావతి విని అయ్యా మునీశ్వరులారా హరిని స్తోత్రము చేయుటవలన వచ్చు భాగ్య మేమో యవనాంగ తెంగింపుము యనియడుగగా నారదులు చెప్ప నారంభించినారు-

శ్లో॥ వాసుదేవం పరిత్యజ్యయోన్యదైవముపాసతే

తృషితో జాహ్నవితీరే కూపం ఖనతిదుర్మతిః॥

వ॥ యెట్లనగా నారాయణుని సేవించక యితర దేవతలను ధ్యానించువాడు యెట్టివాడనగా దాహమువలన దప్పిదగిలినవాడు గంగగట్టున నూయి త్రవ్వి నీళ్ళకు అల్లాడిన వాని రీతిగదా యని యెరుగవలెను ఆ నారాయణుని ధ్యానించిన యెడల గలుగు ఫలము యేమనగా-

శ్లో॥ జన్మాంతర సహస్రేషు తపోధ్యాన సమాధిపః

నరాయణాంక్షీణ పాపానాం రామభక్తిప్రజాయతే॥

వ॥ తల్లి లీలావతి యీ మానవజన్మంబులో భగవధ్యానసమాధియను సత్కర్మములు చేసి యున్నవారికి ఆ నారాయణునిమీదు భక్తిగలుగును అట్లు భక్తి జేసినవాడె సత్పురుషుడని యెరుగవలెను శ్రీమన్నారాయణాయ నమః॥ యని ధ్యానించిన యెడల సకల పాపములు దొలగి సుఖమునొందుదురు యని చెప్పగానె లీలావతిగర్భమందున్న బాలుడు ఊహించి వినుచుండెను ॥

దోరా. తో

అట్టిసమయంబున హిరణ్యకశిపుడు అద్భుతతపము చేయగన్ను ం

దేట్టి దేవతలు భయమునొందిరి- యిట్టైన ఆశ్చర్యము పొందగన

రాయణుని ధ్యానించి మోక్షమును జెందవలెను యెట్లనగా అకార ఉకార మకారంబైన త్రిమూర్తులను యొకటిగా నెంచి ఓంయను ప్రణవముగా నిలిపి ధ్యానించినయెడల మోక్షప్రదాయకుడై యెటువంటి బాధతొలఁగి సంతోష సముద్రంబున నీదుదురు శ్రీనారాయణాయని నోటచెప్పినప్పుడే సకలసంపదలులభించునని చెప్పగా బాలురందరున్ను నారాయణుని ధ్యానించు కొని ఆనందముగా యుండిరి.

రాగము- కేదరగౌళ - చాపుతాళము.

నారాయణ నారాయణ నారాయణ నారాయణ
నారాయణ నారాయణ నమ్మితిని రారా నా॥
దామోదరహరి ముకుంద ధీనజనగంభీర
నా మొరలాలకించి నారాయణ బ్రోవవే నా॥
ఇందున్నావని మేము యెందు వెతకుదుము
సందేహముతీర్చేవాడు స్వామిగావ రారా నా॥
ఆదిపరబ్రహ్మనీవు ఆవరించుకున్నాడయ్యా
శోధింపకయిటు తావయ్యా సుప్రప్రకాశ దీరా నా॥
ధరలో శ్రీరామ దాసుని గాచినట్టి
వరదా నాపై యేలవాదు వంచన చేయతగదు నా॥

వ॥ యీలాగు బాలురందరున్ను యొకే మనస్సుగలిగి నారాయణుని ధ్యానించు సమయంబున ఉపాధ్యాయులువచ్చి వీరియందరిన్ని చూచిచింతాక్రాంతంబు జెంది యితనిమీదు వీనివల్ల బాలురందరున్ను చెడిపోదురు యని యెంచి ప్రహ్లాదుని దోడ్కొనిపోయి వారితండ్రిముందుగా విడిచి పెట్టగా తండ్రిబాలుని యెత్తి తనతొడలమీదు గూర్చుండబెట్టుకొని చెప్పసాగెను.

శా॥ చోద్యంబయ్యెడు నింతకాలమరిగెన్ శోధించియేమేమి సంవిద్యాంశంబులు చెప్పిరో గురువులే వెంటన్ పఠింపించిరో విద్యాసార మెరుంగ గోరెద భవద్విజ్ఞాత శాస్త్రంబులో। పద్యంబొకటి చెప్పిసార్థముగ తాత్పర్యంబు భాషింపుమీ॥

వ॥ ఓరి నాయనా నీకు వుపాధ్యాయులు చెప్పినట్టి శాస్త్రంబులలో నొక పద్యంబు చెప్పి వాటి తాత్పర్యంబును తెలియపరచి నామనస్సు సంతోషపడ జేయుమీ తండ్రీయని చెప్పగానె బాలుడు తండ్రి ముఖము చూచి చెప్పసాగెను.

క॥ చదివించిరి నను గురువులు। చదివితి ధర్మార్థ ముఖ్య శాస్త్రంబులనే చ

చదివినవిగలవు పెక్కులు చదువులలో। మర్మమెల్ల దవివితి తండ్రీ॥

వ॥ నాతండ్రిగారు మీకృపాకటాక్షమువల్ల అనేకశాస్త్రంబులనుచదివితిని అవియుంగాక మర్మశాస్త్రంబైన జ్ఞానబోధనచదివియున్నారు తండ్రీ యనిచెప్పగానే హిరణ్యకశిపుండు సంతోషమునొంది ఆమర్మంబేమో నాకు తెలిగింపుమనుచు చెప్పగానె బాలుడు చెప్పటకునారంభించెను.

రాగము- సెలావేరి - ఆదితాళము.

కానులాత్ముని జ్ఞానమొందితి
కరుణించిన నన్నేలమంటిని క॥
సహగసము యికలేదంటిని
వేదములలోందు వెలసింతియందు క॥
ఆసినాగాయగుని అనుదినమనము
సాధించిచూచితె శ్రీరామదాసుని
ఆదరించిట్టి ఆనందరూపుండు క॥

వ॥ యిటుచెప్పగానె హిరణ్యకశిపుడు నధిక కోపంబునొంది తన తొడలమైయున్నబాలుని నేలంద్రోచి వోరిపాపియనియుపాధ్యాయులఁజూచి చెప్ప నారంభించెను-

చ॥ పటుతరనీతిశాస్త్రచయ। పారగుఁ జేసెదనంచు బాలునిఁ బట్టుకొనిపోయి వానికినహా మహాశైవవిరోధశాస్త్రముల్। కుటిలత జెప్పినాడవు భృగుప్రవరుండవటంచు నిన్నెంచితి కటకట బ్రాహ్మణోత్తమునిగాక దుర్మార్గుఁడవు బ్రాహ్మణుండవే.

వ॥ ఓరిబ్రాహ్మణా నాపుత్రుని పిలచుకొనిపోయి నేమిమెరుంగని వానికి విరోధమైన శాస్త్రంబులు చెప్పతగునాయని కోపించియడుగగా నుపాధ్యాయులు చెప్పనారంభించెను.

ఉ॥ తప్పులు లేవు మావలన దానవనాథవిరోధశాస్త్రముల్। చెప్పము క్రూరులై పరులు చెప్పరు మీచరణంబులాన। మెప్పుగ నీకుమారునకు నింతయునైన మనిషమెవ్వరుం। చెప్పిటిపాటిగాదు ప్రతిచింతదలంపుము నేర్పునన్నరా॥

వ॥ ఓ దానవరాజా యిట్టిశాస్త్రంబులు చెప్పుటకు సాధ్యముగానేరదు మీకు విరోధంబైన శాస్త్రంబులు చెప్పము యివి నిశ్చయమని చెప్పగానె హిరణ్యకశిపుండు బాలునిచూచి యిట్లనియె.

డోరా.

దుర్వాగునీకిటుబోధనమిప్పుడు నెరుగబల్కినారు చెప్పరోరి

# ప్రహ్లాదుని హరికథ

యివ్విధ బుధగురుపుణ్యసేమ యెప్పుడుచెప్పిరచెప్పుకోరి
యిట్టిమాటలువిన్నాడా బాలుడు యిచ్ఛతోతండ్రినిగాంచి
గొట్టిగ పరమాత్ముడు రాడు గట్టిగ నను జెనంబాచి   శ్రీ॥
యీమాటలువిన్నయప్పుడె యితడుకోపముగాంచి
సాహసంబుగ బాలునిద్రోచి తన్నెనుయాప్పడుగ్రుంచి   శ్రీ

వ॥ అంతట హిరణ్యకశిపుండు రాక్షసులనుబిలిచి వారి రాక్షసులా వీనిబట్టి యొకదినము యేనుగకాళ్ళక్రింద త్రొక్కించుడి యొకదినముకొండ మీదనుంచి త్రోయుడు యొకదినము అగ్నిస్తంభమును ఆలింగనముచేయుమని చెప్పుము యీలాగు హింసలుజేసినవినకపోతె వానికి మంచిశాసనము గలదని చెప్పగానె ఆక్షణంబు రాక్షసులు బాలునిదోడ్కొనిపోయి పళ్ళెంబు త్రవ్వి బాలునికంఠమువరకు బూడ్చి పట్టపుయేనుగను నడపించి త్రొక్కించుమని చెప్పగానె యేనుగ బాలునిముందు బోకుండగా వెనుకనిలుచు వింతలు చూచి అందరుఆశ్చర్యమును జెంది యుండగా బాలుడు యేనుగనుచూచిన శ్రీనారాయణుని ధ్యానించెను.

రాగము- కాపి- చాపు

పాలించరా పాండురంగా యనువెట్లు.

రక్షించగావయ్యా రామా-యిక
రక్షకులేరురా యీక్షణము గావ   ర॥
పక్షివాహనుడని బతిమాలితినిన్ను
కష్టముదీర్చరా కన్నులజూడరా   ర॥
దిక్కులనివేయరి మ్రొక్కితినిచాలా
అక్కరతోనన్ను ఆదరించుఈ వేళ   ర॥
పరిపరివిధముల పాడితినోసై
ధరలోశ్రీ రామదాసుని గావర   ర॥

వ॥ యీలాగు ధ్యానించగా యేనుగగర్జించి ముందుబెట్టిన పాదంబువెనుకదీసి నడవసాగను యింతలో ప్రహ్లాదుండు పళ్ళెము విడచి తనతండ్రి సముఖమునకుబోయి నారాయణుని ధ్యానంబు జేయుచుండెను బాలునిచూచి వారి రాక్షసా యిప్పుడువిరోధమైన శాస్త్రంబు నోట జెప్పవద్దుయనిచెప॥ గానే బాలుండు తండ్రినిచూచి నేను జెప్పినట్టి మాటలు వినుము యని చెప్ప నవలంబించెను.

రాగము- సురుట్టి- ఆదితాళము.

హరినామమని నీజీవముకనిబట్టి-ఆత్మయేదియనిజూడుతండ్రి హ॥
హరినామమనుమంత్రము- ఆదిమూలమున
అనుచరించువారె నాగురులన్నా
అతితమిదిగో గతియిదిచూడు హ॥
ముక్తిపొందేత్రోవయేదియనిచూడు- మోక్షంపొందుటయేదితండ్రి
భక్తితోను ఓంప్రణవము లేపి
పొందెదారికనరన్నా
మూర్తియయితడె సాక్షియయితడె హ॥
నామనేమంత్రము ఆదిమూలమాయమూర్తికెవరు
నీతో తెలియుతండ్రి
ఆమనియాడగ అతడెసద్గురుడారా
ఓమనినీతో జూపెపెత్తములజూడయరుదు
ప్రపంచితయిదిగో చంచలమ్యాలను హ॥
సూక్ష్మసూక్ష్మమున అన్నియున్నదనె సూక్ష్మమునీలో యేదితండ్రి
సాక్షియేలవి రెండ్రినివాక్యము
సహజముగజూచి బ్రతుకటమేలు
చంచలమేలమించి కవిడువృచీచీ హ॥

వ॥ ఈలాగు చెప్పగానేకోపముజెంది రాక్షసకింకరులజూచి వీని కొనిపోయి కొండమీదనుంచి నెలుద్రోయుముయని ఆజ్ఞయివ్వగానె రాక్షసులుదోడ్కొనిపోయి చేతులకాళ్లుగట్టిత్రోయ సమయంబున ప్రహ్లాదుండు నారాయణునిధ్యానించు విధమెట్లనగా-

రాగము- కాంబోధి- ఆదితాళము.

నన్నుగావరావా నారాయణదేవా
నిన్నునమ్మినారా-నీరజాక్ష రారా న॥
యెన్నివెతముల పిన్నవింతునేను
చన్నుతించరారాసామినాపైవాదా న॥
కటింగావలేదా కరుణించరాదా
నరహరిముకుందా నాముందురారాదా న॥
వరలోశ్రీరామునిదాసునిగాచిన న॥

# ప్రహ్లాదుని హరికథ

వరద వెంకటేశా నామదేల సర్వేశా ॥న॥

వ॥ యీలాగు ధ్యానించుచుండగా రాక్షసులు దొప్పన నేలం ద్రోచిరి ఆసమయంబున భూమిదేవి తటుక్కున వచ్చి బాలుని తన చేతియందు బట్టుకొని బాలునితో గర్భ భయము జెందబోకు యింక కొద్ది దినంబులలో నారాయణుండు ప్రసన్నుండై మోక్షమిత్తురని చెప్పి మరగెను. యీమాటలు విని బాలుండు సంతోషము జెంది తండ్రి ముందుగా బోయి నిలువగానె తండ్రి బాలుని జూచి ఓరి కూనా యిప్పుడైనా దుర్బుద్ధి మరచి నావాయని యడుగగా బాలుండు చెప్పసాగెను.

రాగము - కేదారగౌళము - మిశ్రజాతి - ఆదితాళము.

ఓం నమో నారాయణాయ యనుచు మనసా వెరొక
విపరీత దేవతల కొలువుమూ-రోరి ॥ఓం॥
ఆళించుమూలదిత పరముక్-గతి
అనుచరించుట నీ తథస్థిరవ కారోరి ॥ఓం॥
బుద్ధియొకటిగా నిల్పుజూడుమీ వేరొక
భక్తియాలఘునముంచి జూడుమీ ॥ఓం॥
ఎన్ని వితములజూచినా నుమిన
నొక్కటెఅరువా రెను ఘ్రూనురోరి ॥ఓం॥
మణిపూరగమనేటి సద్గురుడు నెవడు
మతెనుంచిజూడగ వేఘనిరోరి ॥ఓం॥
వరభోగేంద్రుని జ్ఞానవాక్యమనస్సు
వేరొావక నిలచి తెస్లాఘ్యరోరి ॥ఓం॥

వ॥ యని చెప్పగానె హిరణ్యకశిపుండు కోపించి రాక్షసులజూచి యీదుష్టుని బట్టి అగ్నిస్తంభంబున గట్టి గొట్టుండి యని ఆజ్ఞపరచగా రాక్షసులు వీనిని బట్టి స్తంభంబున గట్టిరి బాలుడు నారాయణుని ధ్యానించు విధ మెట్లనగా.

అటమిందు మున్నం - ఆడదా మెనయును మెట్టు-

రాగము - భైరవి - చాపుతాళము.

హరిహరి శ్రీనారాయణ-అదరించురా ॥హ॥
నరహరి గోవింద నాదు నారాయణ దీక్ష్య వాడా
కరిని గాచిన దేవా
గరుడగమన ఖుటు రావయ్యా కష్టమెల్ల దీర్చుమయ్యా
పరిసోధించకు

ఖతిమాలితినిన్ను చాలా భక్తుడుగా దేవో వేళ
గతియంటినినిన్ను ||హ||
ధరలో శ్రీరామదాసునిచా దయవుంచి బ్రోవయేలవాదు
పరమదయాళా ||హ||

వ॥ ఈలాగు ధ్యానించగా అగ్నివిని యేమిజేయక నిలచెను ఆబాలు డుయచ్చోట విడచివురల తనతండ్రి సముఖమునకుబోయి నిలవగానె నా రాయణుని ధ్యానించెను హిరణ్యకశిపుండు యీపలుకులువిని గోపించి పా ములబట్టువానిఖిలచి విషము తెమ్మంచెప్పగానె ఆవిషము యెత్తి రాజుయెద్ద యివ్వగానె హిరణ్యకశిపుండు విషంబుయెత్తి లీలావతియొద్దయిచ్చి ప్రహ్లాదు నికిచ్చి జంపుమయానిఆజ్ఞపరచగానె యీమాటలువిని లీలావతి దుఃఖించి బా లునిజూచియిట్లనియె.

రాగము - పున్నాగవరాళి - రూపకము.

రారా నాముద్దుకుమరా ననుగన్నతండ్రి ||రా||
తారానాదుతండ్రి రాఘవస్తుతిజ్ఞాన
నీరజదళసూత్ర నిర్వితఘణనేత్రా ||రా||
ఇట్టివైరాగ్యము యెవరుకల్పించినారు
యెట్టివారికైన యెరుకనిజ్యోతికన్న ||రా||
చిన్నారిబాలరారా చిన్నిగోపాలరారా
నన్నాదరించరారా నాముద్దుబాలరారా ||రా||

వ॥ యీలాగుబిలచిన తండ్రియొద్ద తిరస్కింపలేగునా ఇదోనీకువిషము ఇమ్మనిఆజ్ఞపరచెను నేనుయెట్లుమనసొచ్చి ఇత్తును యేద్వగా ప్రహ్లాదుండు విని తల్లినిజూచి అమ్మానీవిటు అల్పబుద్ధిగొని బలుకుటకరీతిగాదు విషము అమృతముగాదా వరుసవో మేనత్తగావలెను అవియెట్లనగ శివశంకరమూర్తి శిరంబునందుధరించినగంగాదేవి వారికిభార్యగదా ఆగంగానాతండ్రియైననా రాయణునిచెల్లలుగదా నాకుఅత్తగావలెనుయనిచెప్పి త్రాగినంతలో భూవుకుతగినమూర్ఛజెందెనుయీఘోరముజూచిలీలావతియేడ్వనారంభించె.

రాగము - ముఖారి - ఆదితాళము.

అంత్యాసమోసముచేయనైతివో బాలాయీ
సయ్యాటలకు యేమిచేతుబాలా
నిన్నునమ్మితినినాదుపుత్రాయిటు

# ప్రహ్లాదుని హరికథ.

నన్ను విడిచి మరిగితివో గాత్రా (౨)
గన్న గర్భము గాలె తండ్రి యిక
యెన్నడు నిను చూతుసూ తా (౩)
చిన్న ప్రాయమందు తండ్రి యీ
చిలుకను సిల్లికియ్యనైతి తండ్రి॥ (౪)

వ॥ ఇట్లు చింతించు సమయంబున బాలుడు నిద్రజెందినవానివలె లేచి భగవంతుని దలచి ధ్యానము చేసుకొని తండ్రి సముఖమునకు బోవగానె హిరణ్యకశిపుండు వీనిని జూచి వోరి పాపి ఇట్లు ధ్యానించుట తగునా యని మరల తాను చెప్పసాగను-

క॥ దిక్కుల గెలిచితి నన్నింటను దిక్కెవ్వడురోరి నీకు దేవేంద్రాదుల్ దిక్కుల రాజులు వేరొకని కెరుగక కొలుతురు తడె దిక్కు నినన్నా॥

వ॥ ఓరి బాలకా యనేక దిక్కులను గెలిచినాను యిదియుంగాక దేవాది దేవతలందరున్ను నాకు వూడిగము చేయుచున్నారు అనేక వరంబులు చేకొని యున్నాను నన్ను వినా దైవంబు లేదని ప్రపంచమంతయు నన్నె ధ్యానించుచున్నారు యిట్టి వరంబులు చేకొన్నవాని గర్భంబున బుట్టి నీ పినతండ్రి జంపిన చండాలుని ధ్యానించుట తగునా నన్ను తప్పినా దిక్కు యెవరు యింతలో బాలుడు యీ పలుకులు విని చెప్పసాగను.

క॥ దిక్కులు కాలములోనె దిక్కులు నేక్రూరులును దిక్కుర మొుగవైది క్కు గలలేనివారికి దిక్కై యుండియది నాకు దిక్కు మహాత్మా॥

వ॥ బ్రహ్మ వుద్భవించిన నరజన్మంబులకు కాపాడునట్టి కర్త యొకడు నాకుడుగడా అట్టి పరమపురుషుండు నాకు దిక్కు యని చెప్పగా హిరణ్యకశిపుండు కోపించి బాలుని జూచి యిట్లనె-

క॥ బలవంతుండనె జగముల బలములతో జనక వీరభావమున మహాబలుల జెయించితిమి నెవ్వని బలమున నాడెదవు సాకు ప్రతివీరుడవై-

వ॥ ఓ గోరి పాపి అనేక బలాఢ్యుడైన దేవాది దేవతులను జయించిన నా వంటి బలాఢ్యుడు యీ ప్రపంచమందున్నాడా యీ వైగ్గ్యము గా పలు మాటలు బలుకగా ఆహా నాకన్న బలము గల పురుషుండు రెవ్వడు చెప్పుమని యడుగగా బాలుడు యీ మాటలు విని వోమూఢమతిగొన్న తండ్రి వినుము-

క॥ బలయుతుల దుర్బలులకు బలమెవ్వడు నీకు నాకు బ్రహ్మాదులకున్ బలమెవ్వడు ప్రాణులకున్ను బలమెవ్వండట్టి విభుడు బలమెను రేంద్రా॥

వ॥ దుర్భరులకున్ను బ్రహ్మాది దేవతలకున్ను నావంటి భక్తులకున్ను బలము నిచ్చి గాపాడునట్టి పరమపురుషుండైన ఆదినారాయణుండె గదా యతని వల్లగా ఇతరులవల్ల నేమిబలము రాబోవుతున్నది యనిచెప్పగా నా హిరణ్యకశిపుండు కన్నులెఱ్ఱబారి కోపాక్రాంతుడవై ఒరేపాపి అట్టినారాయణుండు.

శా॥ నాతో డంబ్రిబాషలాడెదు జగన్నాథుండు నాకంటెనా । భూతశ్రేణికి రాజు లేడొకడు సంపూర్ణప్రభావుండు । మద్భ్రాతం జంపినమున్ను నెవెతకితి బల్మారు నారాయణుం । డెత్తీశ్వము లేసి లేడు ఇదివాదెందుండు రాదుర్మతీ॥

వ॥ ఓమదాంకారి నాసహోదరుని జంపినప్పుడు నేననేకచోటులందు వెతకియు గానక దాగియున్న చండాలుండుని యొకఁ ప్రభావము బలికెదు వు అట్టిబలాఢ్యుని నేనుజూడవలెను వాడెక్కడని బలుకగా బాలుండు మనస్సున సంతోషము జెంది చెప్పను.

క॥ ఇందగలడందు లేదని సందేహము వలదు చక్రిసర్వోపగతుం । డెందెందు వెతకి జూచిన నందందే కలడు గాన హిగ్రిణివింటె.

వ॥ తండ్రి మీరు యేల ఇట్టి సందేహము గొనియున్నారు ఆ నారాయణమూర్తి యచ్చోటయున్న నిండియున్న వాడు గదా అట్టి పరమాత్మ నాలుగు వేల లక్షల జీవరాసులతో ఆయుధములలో అగ్నియందున్ను సకలమైన వస్తువులయందున్ను వ్యాపించియుంటుడని చెప్పగా హిరణ్యకశిపుండు అధికకోపగించి బాలుని వుగ్రముగా జూచి ఓరి బాలుడా.

క॥ డింబక సర్వస్థలముల నంబోరుహనేత్రుడుండుననుచే మిగుల సం రంభంబున బలికెదని స్తంభంబున జూపగలవే చక్రిఁ గ్రక్కన్॥

వ॥ ఓరి ప్రహ్లాదా యెక్కడయు నిండియున్నాడని బలికినావే అట్టి పురుషుండు నా కొలువు మంటపంబునయుండు స్తంభంబున జూపగలవా యని బలుకగా ప్రహ్లాదుండు ఆహా యీ స్తంభంబున జూపుతును యని చెప్పి శ్రీనారాయణమూర్తిని ధ్యానించుచు పిత వెట్లనగా.

రాగము - కన్నడం - చాపుతాళము॥

ఆదికేశవదేవా ఆదరించుటు రావా
సోధింగకముందు రారా సుందరాకారాధీరా ॥ఆ॥
నారదాదిఘుణేస్తోత్రి నాదాంతవేదసూత్రా

చారిటుటురారా దేనాబాలునిబ్రోవరావా ॥ఆ॥
చాలనిన్నునమ్మితిరా సామియనిగోరితిరా
కాలమిదిగావ రారా కన్నతండ్రి రావోరా ॥ఆ॥
శ్రీరామదాసునిదా చిత్తగించిబ్రోవ రారా
కోరితిపాదముదా కోపముంచకరారా ॥ఆ॥

రాగము - ఆనందభైరవి - యేకతాళము.

శ్రీహరిముకుందహరినమోనారాయణ
చిత్తమునుంచిరారా బీదవానినేదుకావరాదా ॥శ్రీ॥
కరుణాకరనిరంతర నీవానాగతియనినెరనమ్మితి
కరుణించుము గతినమ్మితి ॥శ్రీ॥
శరణేశరణనినుకోరితి
భక్తవత్సలపరిపూర్ణా నానందసాయ.
పరిపాలించవె నాపైమకృపయుంచి
చిత్తుచిత్తు అనంతుమనవని
సాష్టాంగుజన్నైతిని యేప్రొద్దుచు
నిత్యమైనసద్గురుడు నీవేయంటిని
నిరామయమైన సర్వేశ్వరకృపవుంచు
నిత్యమునీవే సత్యమునీవే
భక్తులకెల్లనిత్యమునీవేయంటి ॥శ్రీ॥
యేవితములచూచిననీవేగదాగతి
నికన్నదిక్కెవ్వరు గురునాథా
పాపసంసల దుర్గుణాలు నదీచ్ఛవే
భక్తుడునేనని నిత్యముగావలె
ఆపదకాలమున నీవేరదాకృపయుంచి
ఆపదకారుణ్యానను చేయిబట్టి విడువవద్దు
నీభక్తుడునేనని కోరితి
ఆపదవేళలోన నీకన్నదిక్కెవ్వరు ॥శ్రీ॥
నిత్యానినిత్యమున నీవేగానమతినుంచి
నిత్యయాబరచితినీవె తల్లితండ్రి
అత్యయముగనన్ను కావరకృపయుంచి

# ప్రహ్లాదుని హరికథ.

ఆపదకాలమునది కేశవ్వరునీకన్న
సత్యయముగావాకుటిన అత్యయమునిల్పవయ్యా
కష్టమేలవీరిం భోగేంద్రునితోను
వాడులు మేలకరుగించరయిదిగో
తడిమరణవిచారణము లేకను ||శ్రీ||

వ॥ ఈలాగు యనేకవితములుగా ధ్యానించినపిమ్మట బాలుడైన ప్రహ్లాదుండు తనతండ్రియైన హిరణ్యకశిపునిజూచి అయ్యా యీ స్తంభంబున శ్రీమన్నారాయణుండు ప్రసన్నుఁడైయున్నారు యని చెప్పగానె హిరణ్యకశిపుండు కోపాక్రాంతంబు జెంది కండ్లురెఱ్ఱబారి గర్జించి తటకున లేచి మొదటియున్న స్తంభంబును తనకాలుతో తన్నగానె స్తంభము రెండుగాచీలి శ్రీమన్నారాయణుండు నారసింహరూపము దాల్చి ప్రసన్నమాయెను.

కనిగళ్ పరికెండ్రెక్ యనుమెట్టు.

రాగము - అరభి - ఆదితాళము.

ప్రసన్నంబాయెను శ్రీనారాయణమూర్తి ||ప్ర||
ప్రసన్నుఁడాయెను భక్తులగాచుటకు
విశతోదుష్టులను వింపుతో ద్రుంచను ||ప్ర||
సుఖచిత్రములు చతుర్భుజములలోను
సంకటములుదీర్చను సామియీవేళను ||ప్ర||
పెద్దలమాషించె పాపులనుబట్టి
సుద్ధమైనచక్రముతో ద్రుంచను చేబట్టి ||ప్ర||
ధరలో శ్రీరామదాసుని గాచుటకు
నిరతమైనటినిత్యానందమౌడవేళ

వ॥ యీలాగు శ్రీమన్నారాయణమూర్తి నారసింహరూపమై భక్తుల వధించినదుష్టుడైన హిరణ్యకశిపునిబట్టి తనతొడలమీదుబెట్టి తనచేతిగోళ్ళవల్ల వానిగర్భముచీల్చి పేగులుయెత్తి మెడయందు హారము వేసుకొని నిర్మలమైనిలచియుండ దేవతులందరున్ను పుష్పవర్షంబు జల్లిరి ఆనందసముద్రంబుని మునిగి బాలుడైన ప్రహ్లాదుండు శ్రీనారాయణుని ధ్యానించెను.

రాగము - శంకరాభరణము - చాపుతాళము.

వరమియ్యరావయ్య శ్రీనారాయణ
వరలక్ష్మీలోలా

# ప్రహ్లాదుని హరికథ.

పరమ పురుషున్ను బతిమాలితినిన్ను
తరముయిదిగాని దయయుంచునాపై ||ప||
నేతమెంచకయ్యా నీవేగతినాకయ్యా
ఘోరపాపములద్రుంచి గొబ్బునగావయ్యా ||ప||
నిత్యానిత్యుడైన సర్వాత్మస్వరూపుడైన
సత్యపురుషనినిన్ను సాలనమ్మినారా
ధరలో శ్రీరామదాసునిగావరారా
వరమియ్యాయిదివేళ వంచనచేతునేల ||ప||

వ|| యీలాగు ధ్యానించి నిలువగా శ్రీమన్నారాయణుండు భక్తుడైన ప్రహ్లాదునిజూచి సంతోషము జెంది యికమీదునీకేమి భయము లేదు నన్నెవ్వరున్ను ధ్యానించినయెడల మోక్షదాయకుడౌతువుయని ఆశీర్వదించి అంతర్ధానమాయెను ఓమానవజనులార యీలాటివైరాగ్యము యనుసరించిన యెడల మనమున్ను మోక్షము జెందవచ్చును యీసభయందు వచ్చియుండువారందరున్ను శ్రీనారాయణుని ధ్యానించుము.

## మంగళము.

రాగము - సురట్టి - చాపుతాళము.

మంగళమనిచెప్పరె ఓజనులార ||మంగ||
పొంగుచు రామునికి పంకజదళనేత్రునికి
శంకటములదీర్చెటి శంఖుచక్రునికి ||మంగ||
నిత్యానిత్యునికి నిరంజనగాత్రునికి
సత్యమిదియని నిత్యమునమ్మినవారికి ||మంగ||
ఆదిసర్వేశ్వరునికి ఆనందరామగురునకు
శ్లోకమైనజ్ఞానసీతకి దెలిపినవారికి ||మంగ||

ప్రహ్లాదుని హరికథ.

సంపూర్ణము.

